ఇక్కడ దాం అనే క్రియాంత ప్రత్యయం వ్యస్తంగా ఉభయ ప్రార్థనంలో వస్తుంది ఉదాహరణకు మనం ఇవాళ సినిమాకు వెళదాం కాని (200)లో ఇది ఉభయ ప్రార్థనం కాదు అందువల్ల గుప్త నిర్మాణంలో ఉభయ ప్రార్థన క్రియను ప్రతిపాదించే వీలులేదు గర్భివాక్యంలో కు బంధంతో గర్భవాక్యంలో కర్త సమబోధకమైనప్పుడు వికల్పంగా దాం అనే రూపాన్ని సూత్రం ద్వారా ఆదేశంగా తెచ్చుకోవటమే మార్గం సమబోధకం కానప్పుడు ఈ ఆదేశం జరగదు ఉదాహరణకు ఈ కింది వాక్యం వ్యాకరణ విరుద్ధం

*(211) నాకు మా ఆవిడ సినిమాకు వెళ్లాం అని ఉంది

అని ప్రయోగించిన వాక్యాలన్నిటినీ విశేషణాలుగా చేసి వాక్య విషయాన్ని సూచించే నామాల ముందు ప్రయోగించవచ్చు అను ధాతునిష్పన్నమైన అన్న, అనే అనే విశేషణ రూపాలు అనుబంధాలుగా చేరి వాక్యాన్ని విశేషణాలుగా మారుస్తై వాక్య విషయాన్ని సూచించే మాటలు విషయం సంగతి, మాట, ప్రశ్న సందేహం, విశేష్యాలుగా ప్రయుక్తమవుతై

3 8 3: అని తో ఉన్న వాక్యాలను అంటే చేర్చి చేదర్థకంగానూ అన్నా చేర్చి అప్యర్థకంగానూ అని చేర్చి క్త్వార్థకంగానూ అంటూ చేర్చి శత్రర్థకంగానూ ప్రయోగించవచ్చు వాక్యానికి అని అనే అవ్యయాన్ని చేరిస్తే నామం అవుతుందని స్థూలంగా చెప్పుకోవచ్చు ఇట్లా అను అనే ధాతువు చేరుతుందనటం వల్ల సాధారణంగా ధాతువు నుంచి నిష్పన్నమయ్యే వివిధ అసమాపక క్రియారూపాలను సాధించటం ప్రయోజనం

(212) a. వాడు వచ్చాడంటే బుర్ర రామకీర్తన పాడిస్తాడు
b. వాడు వస్తున్నాడంటే అందరికీ హడలు
c. చుట్టాలు వస్తారంటే బస్తీవాళ్లు భయపడతారు.
d. తన్నానంటే మూతిపళ్లు రాలతై
e. నేనీపని చేస్తున్నానంటే నా సొంతం కోసం కాదు
f నేను పాఠం చెప్తాతానంటే పిల్లలు పారిపోతారు.

పై c, f వాక్యాల్లో అంటే అనుకరణలో వచ్చిన అనుధాతు నిష్పన్నమో? ప్రధాన క్రియగా వచ్చిన అనుధాతు నిష్పన్నమో చెప్పటం కష్టం a. b, d, e లలో ప్రయోగించిన అంటే అనుకరణలో వచ్చిన అంటే గా గుర్తించవచ్చు c.f లలో అని అంటే అనే రూపాన్ని ప్రయోగించవచ్చు మిగతా వాక్యాలలో అట్లా ప్రయోగించలేము అనుకరణలో నుంచి c, f లను మినహాయించాలా? అనేది వెంటనే సమాధానం చెప్పటానికి వీలులేని ప్రశ్న వీటిల్లోను మళ్లీ a. dలలో అనుకృత వాక్యంలోని ప్రధాన క్రియనే చేదర్థకంగా మార్చి వస్తే, తంతే అని వాడినా అర్థం భేదం కనిపించటం లేదు

కాంక్షార్థంలో అంటే ప్రయోగించి చేదర్థకం చెయ్యవచ్చు

g. సినిమాకు వెళ్దామంటే పైసల్లేవు
h. సినిమాకు వెళ్లాలంటే పైసల్లేవు

అప్యర్థక రూపాలు కూడా ఈ కాంక్షార్థంలోనే సాధ్యమవుతున్నై

i. ఉద్యోగస్థులకు నెలాఖర్లో కావాలన్నా 10 రూ దొరకవు
j కాఫీ తాగుదామన్నా నా దగ్గర పావలా లేదు
k. టీచరు వచ్చాడన్నా పిల్లలు క్లాసుకి రారు

పై (k) వాక్యంలో అన్నా అనే రూపం అనుకరణంలో వచ్చే అను నుంచి నిష్పన్నమయిందని చెప్పలేం. ఈ వాక్యంలో అని అన్నా అనే రూపం వాడవచ్చు మిగతా వాక్యాలలో అట్లా వాడితే అర్థభేదం వస్తుంది (g), (h) వాక్యాల్లో అట్లా వాడటానికి కూడా వీల్లేదు

l. నేను రోజూ త్వరగా ఇంటికి రానని మా ఆవిడ విసుక్కుంటుంది.

m. వీ పాదాల ముందు వాలిపోతానంటూ సుజాత సుబ్బారావుకు ఉత్తరం రాసింది

(m)లో అనుకృత వాక్యంలో కర్త, ప్రధాన వాక్యంలో కర్త ఒకటే. అట్లా లేకపోతే వాక్యం వ్యాకరణ విరుద్ధమవుతుంది (l)లో అట్లాంటి నిబంధన లేదు కాని (m)లో అంటూ అనుకృతమైన అనుధాతునిష్పన్నమైన క్రియ అని చెప్పలేం ఇక్కడ కూడా అని అంటూ అనే సంయుక్త రూపాన్ని ప్రయోగించవచ్చు

(212)లో ప్రయోగించిన వాక్యాలు వ్యాకరణ వివరణాపేక్షకాలు, కాని వీటి విశేషాలు ఇంకా పరిశోధన కందలేదు. అందువల్ల ఇంతకన్నా చెప్పగలిగింది లేదు వీటిల్లో (1) వాక్యం వంటి వాక్యాలను గురించి కొంత వరకు చెప్పటానికి వీలుంది.

3 8 4 అందుకు ముందుగా ఈ కింది వాక్యాలను పరిశీలించండి.

(213) a. మంచి కూరల్లేవని భోజనం మానేశాను.
* b. జీడిపప్పు లేదని ఉప్మా రుచిగా లేదు.
c. యజమాని వచ్చాడని కుక్క తోకాడిస్తుంది
?d. నువ్వు తొందరగా వచ్చావని రైలు లేటుగా వచ్చింది.
* e. ఈ సంవత్సరం అదునుకు వర్షాలు కురిసినయ్యని పంటలు బాగా పండినై

3 8.4 1: ఈ పైవాక్యాలను పరిశీలిస్తే అని ఇక్కడ హేత్వర్థంలో ప్రయోగించబడిందని సులభంగా గ్రహించవచ్చు అనికి పూర్వమున్న వాక్యాన్ని కారణ వాక్యమని పరంలో ఉన్న

వాక్యాన్ని కార్య వాక్యమనీ స్థూలంగా అనుకుందాం ఈపై వాక్యాల్లో కొన్ని వ్యాకరణ సమ్మతం కాలేకపోతున్నై 213 a bలను పోల్చిచూస్తే కార్యవాక్యంలో మనుష్య వాచకశబ్దం కర్తగా ఉన్నప్పుడే వ్యాకరణ సమ్మతమవుతుందని చెప్పవచ్చు కార్యవాక్యంలో మనుష్యేతర ప్రాణి వాచకశబ్దం ఉన్నా 213 c, వ్యాకరణ సమ్మతంగా కనిపిస్తున్నది (e)లో ప్రాణి వాచకశబ్దం కార్యవాక్యానికి కర్తగా ఉన్నా వ్యాకరణ సమ్మతమయింది అందువల్ల ఈ మూడింటిని పోల్చిచూస్తే కార్యవాక్యంలో జంగమప్రాణి వాచకశబ్దం కర్తగా ఉండాలని ప్రతిపాదించవచ్చు (d)లో వాక్యం ఆమోదయోగ్యంగా కనిపించినా వ్యాకరణ సమ్మతం కాదు రైలుబండికి ప్రాణి వాచకత్వం ఆరోపించటం వల్ల ఈ వాక్యం తయారయింది

**3.8.4.2·** ఈ కింది వాక్యాల్లో ప్రాణి వాచకశబ్దాలు కర్తలుగా లేకపోయినప్పటికీ వ్యాకరణ సమ్మతాలే.

(214) a. నేను ఆలస్యంగా ఇంటికి వస్తానని మా ఆవిడకి కోపం
b. ఇంట్లో పని ఎక్కువయిందని మా ఆవిడకి విసుగు
c. పిల్లలు సరిగ్గా చదువుకోవటం లేదని మా ఆవిడకి దిగులు.

పైవాక్యాల్లో ప్రధాన వాక్యాల ఆఖ్యాతాలు (Predicates) క్రియలుకావు కాని వాటిని పడు అనే అనుబంధ క్రియను చేర్చి క్రియలుగా మార్చవచ్చు ఇట్లా మార్చినప్పుడు కు బంధంతో ఉన్న నామం ఆ క్రియకు కర్తగా మారుతుంది. కర్తృవిహీన వాక్యాలను కర్తృసహిత వాక్యాలనుంచి నిష్పన్నం చేస్తే ఇంతకుముందు చేసిన సూత్రీకరణ సరిపోతుంది లేకపోతే గుప్తనిర్మాణంలో కర్త్రను భోక్తృ సంబంధాలున్నప్పుడు ఈ రకమైన హేత్వర్థబోధ జరుగుతుందని చెప్పాలి ఈ వాక్యాల్లో ఆఖ్యాతాలు మనః స్థితి బోధకాలు. వాటిని క్రియలుగా మార్చినప్పుడు మనః పరిణామ బోధకాలవుతై.

**3 8.4 3:** మనః స్థితి బోధకాఖ్యాతాలున్నదల్లా ఇట్లా హేత్వర్థం వస్తుందని చెప్పలేం.

(215) a. లాటరీలో డబ్బు వస్తుందని సుబ్బారావుకు ఆశ.
b. విప్లవం వస్తుందని విరసం కవులకు నమ్మకం.

పై వాక్యాల్లో హేత్వర్థం లేదు అనికి పూర్వమున్న వాక్యాలకు ఆశ, నమ్మకం అనే ఆఖ్యాతాలకు దగ్గరి సంబంధం ఉంది ఉదాహరణకు ఈ కింది వాక్యాలు. (215) వాక్యాలతో సమానార్థకాలు

(216) a. సుబ్బారావుకు లాటరీలో డబ్బు వస్తుందనే ఆశ ఉంది.
b. విరసం కవులకు విప్లవం వస్తుందనే నమ్మకం ఉంది.

ఈ రెండు వాక్య సమూహాల్లోనూ సుబ్బారావుకున్న ఆశ స్వభావం విరసం కవులకున్న నమ్మకం వ్యక్తమవుతున్నది ఈ కింది వాక్యాలలో ఇట్లాంటి సంబంధాన్ని చూపించలేం

(217) a. మా ఆవిడకు నేను ఆలస్యంగా ఇంటికి వస్తాననే కోపం ఉంది

b మా ఆవిడకు ఇంట్లో పని ఎక్కువయిందనే విసుగుంది

c. మా ఆవిడకు పిల్లలు సరిగ్గా చదువుకోటం లేదనే దిగులుంది

217 వాక్యాలను 214 వాక్యాలతో పోల్చిచూస్తే ఒక్క c వాక్యాలకే అట్లాంటి సంబంధాన్ని చూపించగలం. 'భయం అనే అఖ్యాతాన్ని ఉపయోగించినప్పుడు కూడా ఇట్లాంటి సంబంధాన్ని చూపించగలం దీన్ని బట్టి మనః స్థితి బోధక నామాలను కొన్ని వర్గాలుగా విభజించవచ్చు వాక్య విషయాన్ని విశేషణంగా నిత్యంగా గ్రహించేవి వికల్పంగా గ్రహించేవి నిత్యంగా గ్రహించే వాటిలో ఈ హేత్వర్థబోధ ఉండదు వికల్పంగా గ్రహించే వాటిలో హేత్వర్థబోధ ఉంటుంది

**3 8.4.4.** హేత్వర్థం వచ్చిన వాక్యాల్లో జంగమప్రాణి వాచకశబ్దం అనుభోక్తగానో ఉండటం గమనించాం అట్లా ఉన్నా ఈ అర్థంరాని మనఃస్థితి బోధక వాక్యాలను గమనించాం మరికొన్ని వాక్యాల్లో ప్రాణివాచక శబ్దాలు కర్తలుగా ఉన్నా హేత్వర్థం రాకపోగా వ్యాకరణ విరుద్ధాలు అవుతున్నై

*(218) a. ఆధునికమైన ఆయుధాలు లేవని మన సైనికులు ఓడిపోయారు

b. వాళ్లమ్మ కోడిగుడ్లు పెట్టలేదని కిష్టప్ప చిక్కిపోయాడు

c. మందు తాగాడని మా వాడికి జ్వరం తగ్గింది

d. డాక్టర్ పెన్సిలిన్ ఇంజక్షన్ ఇచ్చాడని రోగి చనిపోయాడు

ఈ పై వాక్యాల్లో మనుష్య వాచకశబ్దం కర్తగాకాని - అనుభోక్తగా కాని ఉంది అయినా వ్యాకరణ విరుద్ధాలయినై. ఈ వాక్యాల్లో ఓడిపోవు చిక్కిపోవు జ్వరం తగ్గు, చనిపోవు అనే వ్యాపారాలు ఆ వాక్యాల కర్త్రనుభోక్తకు స్వాధీనంలో లేవు అఖ్యాతాలకు స్వాధీనత నిరధీనత అనే అంశాలను ప్రతిపాదించాలని ఈ వాక్యాలు నిరూపిస్తున్నై ఈ స్వాధీనతా నిరధీనతాంశాలు అన్ని క్రియలకు స్థిరం కాదు.

(219) a. గెరిల్లాలు గెలవాలని ప్రభుత్వ సైనికులు ఓడిపోయారు

ఈ వాక్యంలో ఓడిపోవటం ఇచ్ఛాపూర్వకంగా జరిగింది. ఇచ్ఛాపూర్వకంగా చేసిన వ్యాపారలన్నీ కర్తృస్వాధీనంలో ఉంటై కాబట్టి పైవాక్యం వ్యాకరణ సమ్మతమైంది

**3.8.4.5:** దీన్ని బట్టి అని తో ఉన్న వాక్యం హేత్వర్థం కావాలంటే పరవాక్యంలో జంగమ ప్రాణి వాచక శబ్దం కర్త్రనుభోక్తల స్థానంలో ఉంది అఖ్యాతంలో వ్యాపారం ఆ ప్రాణికి స్వాధీనంలో ఉండాలని సూత్రించుకోవచ్చు కాని ఈ కింది వాక్యం ఇందుకు విరుద్ధంగా కనిపిస్తున్నది

(220) a. ఉపన్యాసకులు రాలేదని సభ వాయిదా పడింది

ఈ పైవాక్యంలో సభ ప్రాణివాచక శబ్దం కాదు అయినా పై వాక్యం ప్రయోగయోగ్యం వ్యాకరణ సమ్మతం అయితే 'సభ దానంతటది వాయిదా పడదు కర్త ఒకరుండి ఉండాలి అంటే పై వాక్యాన్ని కర్తృసహిత వాక్యం నుంచి నిష్పన్నం చెయ్యాలి దాని నిర్మాణం కింది వాక్యంలోలాగా ఉంటుంది

(220) b ఉపన్యాసకులు రాలేదని నిర్వాహకులు సభను వాయిదా వేశారు

**3.8.4 5:** హేత్వర్థబోధలో ఇంతవరకు కార్యవాక్యంలో నియమాలను గురించి మాత్రమే గమనించాం కారణ వాక్యంలో నియమాలను గూడా కొన్ని గమనించాలి అందుకు ఈ కింది వాక్యాలను పరిశీలించండి.

?(221) a. మా అబ్బాయి ఇడ్డెన్లు తిన్నానని / తిన్నాడని భోజనం మానేశాడు.
b నువ్వు జీతం కట్టావని పరీక్ష రాశావు
సి మా పక్కావిడ మమ్మల్ని తిట్టానని మా ఇంటికి రావడం లేదు

ఈ పై వాక్యాలు కారణ కార్య వాక్య భాగాలు రెండూ ఏకకర్తృకాలు వీటిని సంపూర్ణంగా వ్యాకరణ విరుద్ధాలని చెప్పలేంగాని వీటికన్నా పూర్వపు వాక్యాలతో పోలిస్తే ఇవి అంత సమ్మతంగా కనిపించటం లేదు

**3 8 4 6:** పైవాక్యాల్లో ఒకే కర్త రెండు వ్యాపారాలను ఒకదాని తరవాత ఒకటి నిర్వహించినట్టు చెప్పబడింది. ఏకకర్తృక నిర్వాహిత వ్యాపారాల్లో అని ప్రయోగం సమ్మతం కాదని (221)లో వాక్యాలు నిరూపిస్తున్నై అని కి పూర్వమున్న వాక్య భాగంలో భవిష్యద్బోధక క్రియ ఉంటే ఏక కర్తృకత సమ్మతమవుతుంది కాని నిశ్చయార్థక క్రియారూపాలు వాడటానికి వీలులేదు కాంక్షార్థంలో వచ్చే దాం, అని అనే ప్రత్యయాలతో ఉన్న క్రియారూపాలు మాత్రమే ప్రయుక్తమవుతై.

(222) a. సోషలిజం త్వరగా తీసుకురావాలని ప్రభుత్వంవారు పన్నులు పెంచారు
b. పుస్తకాలు కొనుక్కొందామని బజారుకు వెళ్లాను.

ఈపై వాక్యాల్లో అని కి పూర్వమున్న వాక్యభాగం పూర్తి అయిన వ్యాపారాన్ని కాని నిశ్చితమైన భవిష్యద్వ్యాపారాన్ని కాక పరవాక్యంలో భాగానికి లక్ష్యాన్ని సూచిస్తుంది అందువల్ల ఇది వ్యాకరణ సమ్మతమయింది

**3.8.4.7:** అనితో అనుకృతమైన వాక్యంలో ఏ క్రియ ఉన్నా అది మొత్తం వాక్యార్థంలో నిశ్చయార్థకం కాదు రెండు భాగాల్లో ఒకే కర్త ఉంటే కర్త తను నిర్వహించినట్టుగా చెప్పే వాక్యంలో అనిశ్చితత్వాన్ని వ్యక్తం చెయ్యటం కుదరదు అదే లక్ష్యార్థమయితే నిర్వాహిత వ్యాపారం కాదు

గనుక కుదురుతుంది దీన్ని బట్టి ఇంకో సంగతి చెప్పవచ్చు అని కి పూర్వమున్న వాక్య భాగార్థం పరవాక్యంలో కర్త్రనుభోక్తలచేత భావ్యమవుతుంది నిశ్చయార్థం సత్యమనీ భావ్యమైనది సత్యం కానక్కర్లేదని వ్యవహర్త అనుకుంటున్నట్లుగా చెప్పవచ్చు అందువల్ల ఒకే కర్త తను నిర్వహించిన పూర్వవ్యాపారాన్ని గురించి అనిశ్చితంగా ఉండటం సాధ్యంకాదు అని తో అనుకృతమైన వాక్యాలలో అనిశ్చితాంశం ఉందనటానికి ఈ కింది వాక్యాలను గమనించండి

(223) a. వాళ్లన్నయ్య వచ్చాడని మా ఆవిడ గారెలు వండింది కాని నిజానికి రాలేదు
*b. వాళ్లన్నయ్య వచ్చాడు కాబట్టి మా ఆవిడ గారెలు వండింది కాని నిజానికి రాలేదు

(223) a లో అని కి పూర్వమున్న వాక్యభాగం విషయం యథార్థమవునా? కాదా? అనే దానితో ఆ వాక్య వ్యవహర్తకు సంబంధం లేదు కాని 223 (b)ని ఉపయోగించిన వ్యవహర్త అందుకు బాధ్యత వహించాలి అందువల్ల ఒకచోట వచ్చాడని చెప్పి అదే వాక్యాలలో మళ్లీ రాలేదని చెపితే, అది స్వయం వైరుధ్యం (Self-Contradiction) అవుతుంది

**3.9.1:** సంజ్ఞానామాల (Proper names) వర్గ నిరూపణ కోసం కూడా అని ప్రయోగం జరుగుతుంది

(224) a. ఆ ఊళ్ళో వెంకయ్య అని ఒక రైతున్నాడు.
b. ఆదేశంలో మిసిసిపి అని ఒక నది ఉంది

ఈ పై వాటి నుంచి వెంకయ్య అనే రైతు మిసిసిపి అనేనది అనే నామ బంధాలను నిష్పన్నం చెయ్యవచ్చు.

**3.9.2:** అర్థ వివరణలో అంటే శబ్దం ప్రయుక్తమవుతుంది ఈ అర్థ వివరణ ఒక శబ్దానికిగాని వాక్యానికి గాని ఒక విషయానికి గాని సంఘటనకు గాని జరగవచ్చు శబ్దానుకృతి జరిగినప్పుడు అది ఏ భాషాశబ్దమైనా కావచ్చు

(225) a. ఏరాలు అంటే తోటికోడలు
b. అంభస్ అంటే నీళ్లు
c. ఎన్నికలు వస్తున్నయ్యంటే నల్లధనానికి పని కలిగిందన్న మాట.

(224, 225)లో వాక్యాలూ పదబంధాలు ప్రత్యేకంగా ఒకరు లేక కొందరు వ్యవహర్తలు అనుకరించినవి కావు భాషలో పదాలను గాని జీవితంలో సంఘటనలను గాని అనుకృతం చేసి వ్యాఖ్యానం చెయ్యటం ఇక్కడ కనిపిస్తున్నది పైవాక్యాల్లో అని అర్థం అని భావం అన్నమాట (225 సి.లో లాగా) వాడవచ్చు

ఈ అన్నమాట అనేది తెలుగులో ఇతర నిశ్చయార్థక వాక్యాల తరవాత కూడా ప్రయుక్తమవుతుంది ఒక వాక్యం వ్యక్తం చేస్తున్న వాఖ్యానం అని సూచించటానికి వాడతారు అట, కదా అనే శబ్దాలు కూడా వ్యక్తమైన భాషాంశం మీద వక్తృద్దేశాన్ని సూచించేవే

**3.9.3** కొన్ని ప్రశ్నార్థక శబ్దాలకు కూడా అని, అంటే లు ప్రయుక్త మవుతై

(226) a. ఎందుకని రాలేదు?
b. ఎక్కడని వెతికేది?
c. ఏమని. చెప్పాడు.
d. ఎందుకంటే.

ఇట్లాంటి విశేష ప్రయోగాలున్నై వీటిని కూడా అనుకరణ సంబంధులుగానే ఊహించవచ్చు

**3.9.4:** ఇవిగాక గణగణమని పకపకమని మొదలైన ధ్వన్యనుకరణ ప్రయోగాలు కూడా తెలుగులో ఉన్నై భాషేతర శబ్దాలను అనుకరించవచ్చునని ఈ శబ్దాలు నిరూపిస్తున్నై అంతేగాక ధగధగమని తళతళమని వంటి ప్రయోగాలు చూస్తే దృశ్య యోగ్యమైన వాటిని జివ్వుమని ఝల్లుమని అనే వాటిని చూస్తే స్పర్శయోగ్యమైన వాటిని గుప్పుమని (వాసన వచ్చింది) వంటి వాటిని చూస్తే ఘ్రాణ యోగ్యమైన వాటిని కూడా అనుకరించవచ్చునని తెలుస్తుంది ఇంద్రియ గ్రహణ యోగ్యమైన ప్రతిదీ అనుకరణ యోగ్యమేనని చెప్పవచ్చు వీటిల్లో మ కారాగమం విశేషం. ఇదిగాక పరోక్ష విధిలో మాత్రమే ఇట్లాంటి మ కారాగమం వస్తుంది

తెలుగులో అనుకరణానికి చాలా విస్తృతమైన ప్రణాళిక ఉంది తెలుగులో అనుకరణం మీద చేసే పరిశోధన వల్ల అసలు భాషల్లో అనుకరణ తత్వాన్ని పరిశీలించటానికి ఉపయోగిస్తుంది భాషను గురించి భాషలో చెప్పటానికి అనుమతించే సాధనం అనుకరణ. ఈ అనుకరణను గురించి ఇతర భాషల్లో ఏమంత పరిశోధన జరిగినట్లు కనపడదు. తెలుగులో జరిగిన ఈ మాత్రం పరిశీలనైనా అందుకు పనికి వస్తుంది విశాల విశ్వాన్నే గర్భీకృతం చేసుకొనే శక్తి అనుకరణకుంది కాబట్టి భాషను అర్థం చేసుకోటానికి అట్లాంటి పరిశీలన అవసరం.

# 4. సంయుక్త వాక్యాలు

కొన్ని సమాన ప్రతిపత్తిగల వాక్యాలు కలిసి ఒక వాక్యంగా ఏర్పడితే సంయుక్త వాక్యమవుతుంది వాక్య సంయోగాన్ని సూచించటానికి ఇంగ్లీషులో and or, but వంటి శబ్దాలను హిందీలో ఔర్ యా మగర్ వంటి శబ్దాలనూ ప్రయోగిస్తారు ఈ శబ్దాలు వాక్య సంయోగాన్నే కాక పద పదబంధ సంయోగాన్ని కూడా సూచిస్తూ, పై శబ్దాల మధ్య భిన్న సంబంధాల్ని వ్యక్తం చేస్తై and అనే శబ్దం సంకలన సంబంధాన్ని or శబ్దం వికల్ప సంబంధాన్ని but వైరుధ్యాన్ని సూచిస్తై తెలుగులో అన్ని చోట్లా ఇట్లాంటి శబ్ద ప్రయోగం లేదు

**4.1 1:** తెలుగులో రెండు వాక్యాలను ఒకదాని తరవాత ఒకటి ప్రయోగించి వాటి మధ్య సంబంధాలు అర్థాన్నిబట్టి గ్రహిస్తాం సంకలన సంబంధంలో ప్రత్యేకమైన శబ్దం లేదు వాక్యం చివరలో స్వరోచ్చారణ ద్వారా ఈ సంబంధం వ్యక్తమవుతుంది

(227) a. సుబ్బారావు తెలివైనవాడు సుజాత అందమైనది
b సుజాత తెలివైనదీ అందమైనదీ

(227)a లో కలిపిన రెండు వాక్యాల్లో సమానాంశ లేదు ఆ రెంటినీ ఒక వాక్యంగా భావించినా రెండు వాక్యాలుగా భావించినా భేదం లేదు అట్లాంటి భేదాన్ని సూచించే శబ్దాలు కూడా లేవు (227 బి ని ఒక వాక్యంగా భావించటానికి వీలుంది రెండిటిలోనూ కర్త (ఉద్దేశ్యం) ఒకటే అయినప్పుడు సనామబంధలోపం జరిగింది ఈ రెండూ కలిపి ఒకే వాక్యం అనటానికి ఇంకో ఆధారం ఉంది.

c. సుజాత తెలివైనది. సుజాత అందమైనది
d. సుజాత తెలివైనది, ఆమె అందమైనది (కూడా)
* e. సుజాత తెలివైనదీ ఆమె అందమైనదీ.

(227) b, c లను పోల్చి చూస్తే ఈ భేదం తెలుస్తుంది b లో సనామబంధ లోపం జరిగింది అది వ్యాకరణ సమ్మతం (e) లో సర్వనామీకరణం జరిగింది ఏకకర్తృకమైన వాక్యాలను కలిపి ఒకే వాక్యంగా చేసినప్పుడు సనామ బంధలోపం జరిగి తీరాల్సిందే కాని సర్వనామీకరణం జరగటానికి వీల్లేదు. సమాన ప్రతిపత్తిగల వాక్యాలను కలిపినప్పుడు ఆఖ్యాతాలు ఏ వరసలో వచ్చినా అర్థం మారదు

(228) a. సుజాతకు డబ్బుంది తెలివి ఉంది.
b. సుజాతకు తెలివి ఉంది, డబ్బు ఉంది

b సుజాత పొడగరి రూపసి.

b. సుజాత రూపసి పొడగరి

4 1 2 స్థితిబోధకమైన ఆఖ్యాతాలున్నప్పుడే ఇట్లాంటి అర్థభేదాన్ని కలిగించదు వ్యాపార, పరిణామ బోధకమైన వాక్యాలు కలిపినప్పుడు పూర్వాపూర్వ క్రియలు పూర్వాపూర్వ వ్యాపారబోధకాలవుతై. అంటే వాక్యంలో పూర్వవ్యాపారం కాలంలో కూడా పూర్వవ్యాపారాన్నే బోధిస్తుంది వాక్యాలను విడివిడిగా ఉంచినా కలిపినా అర్థవ్యత్యయం ఇట్లాగే ఉంటుంది

(229) a సుజాత ఇంటికి వచ్చింది చీరమార్చుకుంది పొయ్యి మీద కాఫీకి నీళ్లు పెట్టింది

b సుజాత ఇంటికివచ్చి, చీర మార్చుకుని పొయ్యిమీద కాఫీకి నీళ్ల పెట్టింది

c. సుజాత ఇంటికి వచ్చింది. ఆ తరువాత చీరమార్చుకుంది ఆ తరవాత పొయ్యిమీద కాఫీకి నీళ్లు పెట్టింది

(229) a, b, వాక్యాలను c వాక్యపు గుప్త నిర్మాణం నుంచి నిష్పన్నం చెయ్యవచ్చు అంటే a b ల అర్థం c అర్థంతో సమానం. అందువల్ల ఈ వాక్యాల్లో ఆఖ్యాతాలు క్రమ వ్యత్యయాన్ని సహించవు (229) b వంటి వాక్యాలు ఇంతకు ముందు పేజీల్లో సంశ్లిష్ట వాక్యాలుగా వ్యవహరించబడ్డై ఇక్కడ సంయుక్త వాక్యతుల్యాలుగా పరిగణించబడుతున్నై గుప్త నిర్మాణంలో సంయుక్త వాక్యాల నుంచి నిష్పన్నమైన వ్యక్త నిర్మాణపు సంశ్లిష్ట వాక్యాలుగా వీటిని పరిగణించవచ్చు (229) a, b లు రెండిట్లోనూ సనామబంధం లోపం జరుగుతుంది కాని సర్వనామీకరణం జరగదు

**4.1.3:** క్రమ వ్యత్యయాన్ని సహించే వాక్యాలు *తరవాత* శబ్దప్రయోగాన్ని సహించవు 'సుజాత తెలివైనదీ, ఆ తరవాత అందమైనది' అనేవాక్యం సాధ్యమైనా సుజాత గుణాన్ని వర్ణించే వక్త ఆ గుణాల్లో తాను దేన్ని ప్రధానంగా పరిగణిస్తున్నాడో ఎప్పుతుంది కాని, ఆ గుణాల కాల భేదాల్ని సూచించదు.

**4 1.4:** సంయుక్త పదబంధాలను కూడా సంయుక్త వాక్యాల నుంచి నిష్పన్నం చెయ్యవచ్చు సమరూపకాలైన పదబంధాల్లో ఒకదానికి లోపం చెయ్యటం ద్వారా ఇది జరుగుతుంది. ఆ ప్రక్రియ కింది వాక్యాల్లో చూడవచ్చు.

(220) a. సుజాత సినిమాకు వెళ్లింది సుశీల సినిమాకు వెళ్లింది

b. సుజాత, సుశీల . సినిమాకు వెళ్ళింది సినిమాకు వెళ్లింది.

c. సుజాత, సుశీల సినిమాకు వెళ్ళారు.

d. సుశీల సుజాత సినిమాకు వెళ్లారు

**4.1.5: (230)**లో c, d వాక్యాల్లో నామబంధాలు క్రమవ్యత్యయం జరిగినా అర్థభేదం రాలేదు. కాని ఈ వాక్యాలు విడిగా భిన్నార్థ బోధకాలు. ఆ భిన్నార్థాలు కింది వాక్యాల్లో వ్యక్తమవుతున్నై.

(231) a. సుజాత, సుశీల కలిసి సినిమాకు వెళ్ళారు
b. సుజాత సుశీల విడివిడిగా సినిమాకు వెళ్లారు

ఒకే సినిమాకు వెళ్ళారా వేరు వేరు సినిమాలకు వెళ్లారా అనేది వదిలేసినా వాళ్లు కలిసి వెళ్లారా? విడివిడిగా వెళ్లారా అనేది (230)లో వ్యక్తం కాలేదు భిన్న కర్తృకాలైన ఏకవ్యాపార మున్నప్పుడల్లా ఇల్లాంటి అస్పష్టత వాక్యంలో ఉంటుంది

ఒకే వాక్యం బహు కర్తృకమూ, బహు కర్మకమూ అయినప్పుడు కర్తృసంఖ్యను కర్మ సంఖ్యనూ బట్టి ఈ అస్పష్టత పెరుగుతుంది ఉదాహరణకు ఈ కింది వాక్యాలు చూడండి

(232) a. సుజాత సుశీల బజారు నుంచి పండ్లూ కూరగాయలు తెచ్చారు.
b. సుజాత బజారు నుంచి పండ్లు తెచ్చింది
c. సుశీల బజారు నుంచి కూరగాయలు తెచ్చింది
d. సుశీల బజారు నుంచి పండ్లూ కూరగాయలు తెచ్చింది
e. సుజాత బజారు నుంచి పండ్లూ కూరగాయలు తెచ్చింది

(232) లో a కి b-c d-e జంటలలో ఏదైనా మూలవాక్యాలు కావచ్చు భిన్న మూలకం కావటం వల్లనే భిన్నార్థాలు వస్తున్నై

**4 1.6:** పారస్పర్యాన్ని బోధించే క్రియలున్నప్పుడు అట్లాంటి వాక్యాల్నుంచే సంయుక్త పదబంధాల్ని సాధించాల్సి ఉంటుంది

(233) a. సుజాత సుశీల తిట్టుకున్నారు
b. సుజాత సుశీలను తిట్టింది సుశీల సుజాతను తిట్టింది

(233) a కి b ని మూలవాక్యంగా ప్రతిపాదించాల్సి ఉంటుంది

**4.1 7:** భిన్న ప్రశ్నార్థక శబ్దాలున్న వాక్యాలను కలిపేటప్పుడు సమక్రియల లోపం జరగదు

(234) a. సుజాత ఎప్పుడొస్తుంది? సుజాత ఎందుకొస్తుంది?
b. సుజాత ఎప్పుడొస్తుంది? ఎందుకొస్తుంది?
?c. సుజాత ఎప్పుడు ఎందుకొస్తుంది?

సమ ప్రశ్నార్థక శబ్దాలు సమక్రియలూ ఉన్నప్పుడూ అట్లాంటి లోపం జరుగుతుంది

(235) a. సుజాత ఎప్పుడొస్తుంది? సుశీల ఎప్పుడొస్తుంది?
b. సుజాత సుశీల ఎప్పుడొస్తారు?

ఏ - ప్రశ్నల్లాగే ఆ - ప్రశ్నలు కూడా ఒకచోట చేర్చటం వల్లన సంయుక్త ప్రశ్నలు ఏర్పడతై వాక్య సంయోగాన్ని సూచించే పదమేమీ ఉండదు.

(236) a. ప్రతిమనిషికి తిండి గుడ్డ నీడైనా ఉండాలా?
కాని మిగలాలా? మరీ బ్రతకాలా?
b చెప్పేదంతా చేస్తున్నారా? చేసిందంతా చెప్తున్నారా?

**4 2.1:** వికల్పార్థాన్ని సూచించటానికి వాక్యాల మధ్య లేక, లేకపోతే అనే శబ్దాలు ప్రయుక్తమవుతై వాక్య వికల్పం పదబంధ వికల్పంగా పరివర్తన చెందినప్పుడు వికల్పాన్ని చెప్పిన పదబంధాలన్నిటికీ ఓ శబ్దం చేరుతుంది.

(237) a. 1 సుబ్బారావు రేపువస్తాడు లేక ఎల్లుండి వస్తాడు
లేక నాలుగు రోజుల తరవాత వస్తాడు
2. సుబ్బారావు రేపో ఎల్లుండో నాలుగు రోజుల తర్వాతనో వస్తాడు.
b. 1. రేపు సుజాత ఊరికి వెళ్తుంది లేక సుశీల ఊరికి వెళ్తుంది,
లేక సుమిత్ర ఊరికి వెళ్తుంది.
2 రేపు సుజాతో సుశీలో, సుమిత్రో ఊరికి వెళ్తారు. (1 వెళ్తుంది)

**4.2 2:** పై వాక్యాల్లో ఆఖ్యాతేతర పదాల మధ్య వికల్పం చెప్పబడింది. ఆఖ్యాతాల మధ్య వికల్పం రెండు రకాలుగా ఉంటుంది నిశ్చయార్థక, వ్యతిరేకార్థక ఆఖ్యాతాల మధ్య ఉండొచ్చు లేక భిన్న ఆఖ్యాతాల మధ్య ఉండొచ్చు (237) వాక్యాల్లో (1) సంఖ్యగల వాక్యాలు (2) సంఖ్యగల వాక్యాలకు (2) మూలవాక్యాలుగా చూపించబడినై ఆఖ్యాతాల మధ్య వికల్పత్వాన్ని చెప్పినప్పుడు ఇట్లా కుదరదు

(238) a. అతను వ్యాపారస్తుడో భూస్వామో సైరవికారో కాంగ్రెస్ నాయకుడో?
b. సుజాత వంట చేస్తున్నదో అలంకరించుకుంటున్నదో చదువుకుంటున్నదో.

**4.2.3:** ఈ పై వాక్యాలు పైన ఇచ్చిన విధంగా ప్రయోగార్హాలుగా కనిపించటం లేదు ఆ వాక్యాల తరవాత *నాకు తెలియదు ఎవరికి తెలుసు, నీకెందుకు, ఎవరిక్కావాలి, మనకెందుకు?* వంటి వాక్యభాగాలను చేరిస్తే ప్రయోగార్హాలవుతై వికల్పంగా క్రియారహిత వాక్యాలకు కాదు శబ్దాగమం, క్రియాసహిత వాక్యాలకు లేదు శబ్దాదేశం జరుగుతై

(239) a. అతను కాంగ్రెస్ నాయకుడు అవునో, కాదో
b అతను కాంగ్రెస్ నాయకుడో కాదో
c. అతను రేపు వస్తాడో రాడో
d. అతను రేపు వస్తాడో లేదో

(239) వాక్యాలను యథాయథంగా ప్రయోగించవచ్చు. (238) వాక్యాల సందర్భంలో ఉదాహరించిన నాకు తెలీదు వంటి వాక్యాలను చేర్చినా చేర్చవచ్చు.

(238) వాక్యాల్లో వికల్పాఖ్యాతాల మధ్య లేక శబ్దాన్ని ఉపయోగిస్తే ప్రయోగ యోగ్యాలవుతై

లేక శబ్ద యుక్త వాక్యాల నుంచి వికల్ప వాక్యాలను నిష్పన్నం చేస్తూ లేక శబ్దాన్ని (237) (239) వాక్యాల్లో లోపింపజేసి భిన్నాఖ్యాతాల మధ్య లోపం చెయ్యకుండా ఉండటం (238) వాక్యాలను సాధించటంలో ఒక పద్ధతి. ఈ పద్ధతి సరిపోతుందో లేదో చెప్పటం కష్టం ఆ - ప్రశ్నల మధ్య వికల్పం చెప్పినప్పుడు వాటిమధ్య లేక శబ్దం లేకుండానే వికల్పబోధ జరుగుతుంది.

(240) a. అతను పైరవి కారా? (లేక) కాంగ్రెస్ నాయకుడా?
b. సుజాత వంట చేస్తున్నదా? (లేక) అలంకరించుకుంటున్నదా.

**4.2.4:** ఏ శబ్దయుక్త ప్రశ్నల మధ్య వికల్పబోధ ఉండదు ఏ-శబ్దం క్రియేతర శబ్దాల నుంచి ప్రశ్నార్థక శబ్దాలను నిష్పన్నం చేస్తుంది ఒక్కో శబ్దం ఒక్కోరకపు వర్గానికి గుర్తు. ఉదాహరణకు ఎప్పుడు కాలవాచిక్రియా విశేషణం· ఎక్కడ: స్థలవాచి క్రియా విశేషణం; ఎందుకు? హేతు సూచక క్రియా విశేషణం, ఎట్లా. రీతిబోధక క్రియావిశేషణం; ఎవరు: నామవాచకం. భిన్న ప్రవర్తన కలిగిన శబ్దాల మధ్య వికల్పబోధ ఉండదు.

**4.3.1:** రెండు వాక్యాల మధ్య వైరుధ్య సూచనకు కాని శబ్దం ఉపయోగిస్తారు.

(241) a. అతను లక్షలు సంపాయిస్తాడు. కాని ఖర్చు పెట్టడు
b. ఆమె బాగా పాడుతుంది కాని అందంగా ఉండదు.
c. అతను డాక్టరు, కాని ఇంజక్షను చెయ్యటం రాదు

వక్త ఉద్దేశానికి భిన్నమైన విషయ ప్రతిపాదన జరిగినప్పుడు కాని శబ్దం ఆ వైరుధ్యాన్ని వ్యక్తం చేస్తుంది ఉదాహరణకు (241) a లో "డబ్బు సంపాయించే వాళ్లు ఖర్చు పెడతారు ' అని వక్త అభిప్రాయం. దానికి విరుద్ధమైన ప్రతిపాదన రెండో వాక్యంలో జరిగింది అట్లాగే (b) లో బాగాపాడే అమ్మాయి అందంగా ఉండాలని వక్త ఆశించాడు. (c)లో డాక్టరయిన వాడికి ఇంజక్షన్ ఇయ్యటం వచ్చి ఉండాలని అభిప్రాయపడటం సహజం.

(241) a. b, c లలో వాటిని ఒక వాక్యంగా పరిగణించినా, భిన్న వాక్యాలుగా పరిగణించినా భేదమేమీ లేదు. కాని శబ్దం గాని అనే రూపంగా మారుతుంది c లో లాంటి క్రియారహిత వాక్యాలకు ఏ శబ్దం అంతంలో చేరుతుంది. పై వాక్యాలను కలపకముందు కాని శబ్దం బదులు అయితే అయినా అనే శబ్దాలను అర్థభేదం లేకుండా వాడొచ్చు కాని వాటిని కలిపినప్పుడు కాని శబ్దమే ప్రయోగించాలి.

**4.3.2:** కాని కి పూర్వపర వాక్యాలను వ్యత్యస్తం చేసినా ప్రధానార్థ బోధకి కాని వైరుధ్య బోధకి కాని భంగంరాదు వైరుధ్య బోధలో ఉపయోగించే కాని క్రియేతర శబ్దాల మధ్య వికల్పబోధకు కూడా ఉపయోగిస్తుంది

(242) a. నేను రేపుగాని ఎల్లుండిగాని మీ ఇంటికి వస్తాను
b. అబద్ధాలు చెప్పగలిగిన వాళ్లుగాని, డబ్బు ఖర్చు పెట్టగలిగిన వాళ్లుగాని ఎన్నికల్లో గెలుస్తారు

# 5. తెలుగు వాక్యం : కొన్ని ముఖ్యలక్షణాలు

**5.1.1:** భాషాలక్షణ పరిశీలనలో మూడు పద్ధతులను గుర్తించొచ్చు 1 ఏకాభాషా లక్షణ పరిశీలన (Characterology) 2 బహుభాషా లక్షణ పరిశీలన (Typology) 3 సర్వభాషా లక్షణ పరిశీలన (Universals) ఒక భాషకు లభ్యమవుతున్న వ్యాకరణాలను బట్టిగాని, స్వయం పరిశీలన వల్లగాని గ్రహించిన విషయాలను ఏకభాషా లక్షణాలుగా పరిశీలిస్తారు ఒక భాషలో కనిపించే లక్షణాలు ఇంకా కొన్ని భాషల్లో కనిపించవచ్చు కొన్నిట్లో కనిపించకపోవచ్చు ఉదాహరణకు తెలుగులో స్వరసమీకరణం అనే లక్షణం ఉన్నది. ఈ లక్షణం టర్కిష్, నూపే యావల్మనీ వంటి ఇతర భాషల్లోనూ ఉంది ఇంగ్లీషు, హిందీ భాషల్లో లేదు ఒక భాషకు ప్రత్యేక లక్షణం అవునా కాదా? అంటే ఇతర భాషలతో పోల్చి చెప్పాల్సిందే ఒకే లక్షణం భిన్న భాషల్లో కనిపించిందంటే అది ఏక భాషా పరిమితి నతిక్రమించిందన్నమాట అది కొన్ని భాషల్లోనే కనిపిస్తే భాషలు అనుమతించే (లేక అవలంబించే) పద్ధతుల్లో అది ఒకటి అని గ్రహించాలి. ఇట్లాంటి కొన్ని లక్షణాల్ని బట్టి భాషలను విభజించవచ్చు ఇది బహుభాషా లక్షణ పరిశీలన ఒక భాషలో కనిపించే లక్షణం ఆ భాషకు గాని, కొన్ని భాషలకు గాని పరిమితం కాకపోతే దాన్ని సర్వభాషా లక్షణంగా అనుమానించాల్సి ఉంటుంది ప్రపంచంలో ఉన్న అన్ని భాషలను పరిశీలించిన వారెవ్వరూ లేరు. సర్వభాషా లక్షణ పరిశీలన అంటే అన్ని భాషల్లోనూ ఉండటానికి వీలున్న లక్షణాల పరిశీలన అని. ఉదాహరణకు అన్ని భాషల్లోనూ వక్తనూ శ్రోతనూ సూచించే పదాలు. ఉంటయ్యని చెప్పటానికి అన్ని భాషలనూ పరిశోధించక్కర్లేదు బహుభాషా పరిశీలన వల్ల సజాతీయ సంబంధం (Genetic Relationship) గాని ప్రాంతీయ సంబంధం (Areal Relatinship) గాని లేని భాషల్లో పరిశీలించినంత మట్టుకు కొన్ని లక్షణాలు పునః పునరాగత మవుతుంటే వాటిని సర్వభాషా లక్షణాలుగా ప్రతిపాదించవచ్చు ఆ ప్రతిపాదనలు ఇతర శాస్త్ర ప్రతిపాదనల్లాగే తరవాత పరిశీలనకు నిలబడవచ్చు. నిలబడకపోవచ్చు ఈ పుస్తకంలో సర్వభాషా లక్షణాలుగా అనుమానించదగిన కొన్ని లక్షణాలు ప్రస్తావించబడినై. (చూ 2 1 6· 3,1· 3.2; 3 3 1). సర్వభాషా లక్షణాలు క్రమక్రమంగా భాషా నిర్వచనంలో భాగమయిపోతై

**5.1.2:** ఏ దృష్టితో చూసినా ఏకభాషా లక్షణ పరిశీలన అన్నిటికీ మూలం ఇతర భాషలతో పోల్చి చూసి భాషల మధ్య భేదసామ్యాలను కనుక్కోటానికి ఈ పరిశీలన అవసరం ఆ దృష్టితో తెలుగులో ముఖ్యమని తోచిన అంశాలు ఈ అధ్యాయంలో క్రోడీకరించబడుతున్నై వీటిల్లో చాలా వరకు ఇతర ద్రావిడ భాషల్లో కనిపించవచ్చు మరికొన్ని ఇతరేతర భాషల్లో కూడా ఉండవచ్చు తెలుక్కి మాత్రమే పరిమితమైనవి ఇవి అని ప్రస్తుతం నిర్ధారణ చెయ్యటం కష్టం.

**5.2.1:** సాధారణమైన సకర్మక వాక్యంలో పదక్రమాన్ని అనుసరించి ప్రపంచ భాషలను మూడు ప్రధానమైన వర్గాలుగా విభజించవచ్చునని పరిశీలకులు గుర్తించారు అవి 1 క్రియాది 2 క్రియామధ్యమ 3 క్రియాంత భాషలు క్రియాపదం ప్రథమేతరంగా వచ్చే భాషల్లో కర్త తరవాతనే కర్మ ఉంటుంది క్రియాది భాషల్లో మాత్రం కర్మ తరవాత కర్త వచ్చే భాషలు కొన్ని ఉన్నై ద్రావిడ భాషలన్నీ క్రియాంత భాషలు భారతీయ భాషల్లో చాలవరకు క్రియాంత భాషలే మేఘాలయ రాష్ట్రంలో వ్యవహరించే ఖాసీ క్రియా మధ్యమభాష. హిందీని గుప్తనిర్మాణంలో క్రియా మధ్యమ భాషగా పరిగణించాలని ఒక ప్రతిపాదన ఉన్నది

**5.2 2:** వాక్యంలో కొన్ని విశేషాలు ఈ పదక్రమాన్ని బట్టి ఉంటై క్రియాంత భాషలు ప్రాయికంగా పరవిహిత ప్రత్యయ భాషలు క్రియాది భాషలు పూర్వవిహిత ప్రత్యయ భాషలు క్రియా మధ్యమభాషల్లో రెండు రకాలూ ఉన్నై క్రియాంత భాషల్లో నామవిశేషాలు నామానికి పూర్వం, క్రియా విశేషణాలు క్రియకు పూర్వం వస్తై టర్కిష్ జాపనీస్ జార్జియన్ భాషలు ద్రావిడ భాషల్లాగే క్రియాంత భాషలు.

**5.3.1·** తెలుగులో పదక్రమాన్ని గురించి ఇంకా కొన్ని విశేషాలు చెప్పవచ్చు అముఖ్యకర్మ ముఖ్యకర్మకు పూర్వమే ఉంటుంది ముఖ్యకర్మ ప్రశ్నార్థక శబ్దాలు వచ్చినప్పుడు తప్ప ఎప్పుడూ క్రియను అంటిపెట్టుకునే ఉంటుంది ప్రశ్నార్థక పదాలు క్రియకు ఎప్పుడూ సన్నిహితంగా ఉంటై ఉపవాక్యాలు ప్రధాన వాక్యానికి పూర్వమే ఉంటై అనుకృతాంశం అనుకర్త వాక్యానికి పూర్వమే ఉంటుంది. సంఖ్యావాచక పదాలు ఇతర పరిమాణార్థక పదాలూ నామపదానికి పూర్వపరస్థానాలు రెండిట్లోనూ రాగలవు ఉదా: ఆమెకు చాలా చీరలున్నై· ఆమెకు చీరలు చాలా ఉన్నై క్రమ వ్యత్యయం ప్రాధాన్య వివక్షకు అవలంబించే ప్రధానమైన పద్ధతి క్రియకు దగ్గరగా జరిగే వాటికి ప్రాధాన్యం హెచ్చు క్రియను నామ్నీకరించి ప్రాధాన్యం చెప్పదల్చుకున్న వాటిని ఆఖ్యాతృ స్థానానికి జరపటం కూడా ఒక పద్ధతి సమీకరణ వాక్యాల్లో కేవల వ్యత్యయం ప్రాధాన్యాన్ని బోధిస్తుంది వ్యవహృతాంశం మీద వక్త్రభిప్రాయాన్ని సూచించే అటాది శబ్దాలు తెలుగులో ఉన్నై. ఇవి సాధారణంగా వాక్యాంతంలో వచ్చినా ప్రాధాన్యవివక్షలో వాక్యంలో ఏ పదానికైనా తగిలించవచ్చు. అప్పుడు కూడా వికల్పంగా పదక్రమ వ్యత్యయం జరుగుతుంది.

**5.3.2:** తెలుగులో క్రియ చాలా ప్రధానమైన పాత్ర నిర్వహిస్తుంది వాక్యాలను అనుసంధించే శబ్దాలు చాలా వరకు క్రియల నుంచే నిష్పన్నమయినై అనుకృతిలో వచ్చే అని అను ధాతు నిష్పన్నం. *అయితే, అయినా, కాని, కాకపోతే, కాదు, కదా* - వంటి మాటలు *అగు* ధాతు నిష్పన్నాలు. ఆత్మార్థం పారస్పర్యార్థం (కొను) పరార్థం (పెట్టు) పూరణార్థం (పోవు, వేయు) వంటి చాలా అర్థాలు ధాతువిస్తరణ ప్రక్రియ ద్వారా సాధించబడతై క్త్వా శతృ అపి, చేదాది వివిధోప

వాక్యాలు క్రియల్లో మార్పుల వల్లనే ఏర్పడతై (ఇంగ్లీషులో వీటికి క్రియేతర శబ్దాలు వాడతారు.) ఇతర భాషల్లో Relative Clause అనే పద్ధతి తెలుగులో ప్రధానంగా క్రియాజన్య విశేషణం ద్వారా వ్యక్తమవుతుంది తెలుగులో Re ative Pronouns లేవు ఈ రకమైన పద్ధతి తెలుగులో ఉన్న విధి నిషేధాలతోనే బెంగాలీ నేపాలీ భాషల్లో ఉంది ఒరియాలో కూడా ఉండవు) కాని ఇతర ఆర్యభాషల్లో విరళంగా మాత్రమే ఉంది

**5 3.3:** తెలుగులో సమీకరణ వాక్యపద్ధతి విశేషమైనది ఈ రకమైన వాక్యాలు అన్ని భాషల్లో ఉన్నా తెలుగులో క్రియా రహితంగా ప్రయోగించటం విశేషం ద్రావిడ భాషల ప్రభావం వల్ల కాబోలు ఈ పద్ధతి ఒరియా బెంగాలీ నేపాలీ భాషల్లో ఉంది. కాని ఇతర ఆర్యభాషల్లో కనిపించదు ఇదే పద్ధతి రష్యన్ వంటి స్లావిక్ భాషల్లోనూ కనిపిస్తుంది క్రియలేని సమీకరణ వాక్యాల గుప్త నిర్మాణంలో అవు వంటి క్రియను కొందరు ప్రతిపాదిస్తారు కాని అర్థగ్రహణకు అవసరం లేని అవు ను గుప్త నిర్మాణంలో ప్రతిపాదించటం అనవసరం. క్రియలేని ఈ వాక్యాలను క్త్వాశత్రపిచేదాద్యర్థాల్లో అవు ధాతు నిష్పన్న క్రియారూపాలు అనుబద్ధమవుతై క్రియావాక్యాలు ప్రాధాన్య వివక్షలో క్రియనామీకృతమై సమీకరణ వాక్యాలుగా మారటం కూడా తెలుగులో ఈ రకపు వాక్యాల ప్రాధాన్యాన్ని సూచిస్తుంది.

**5.3.4.1·** తెలుగు వాక్యాల్లో కర్త ఉద్దేశ్యం ఒకటి కానక్కర్లేదు. తెలుగులో కర్త కన్న ఉద్దేశ్యమే ప్రధానంగా కనిపిస్తున్నది కొన్ని వాక్యాలకు వ్యక్త నిర్మాణంలో కర్తను గుర్తించటం కూడా కష్టమే. ఇంగ్లీషు వంటి వాక్యాల్లో వ్యక్త నిర్మాణంలో కర్తృపద ప్రాధాన్యం ఎక్కువ ఏమీ లేకపోతే t వంటి నిరర్థక శబ్దాన్నైనా కర్తగా ఉపయోగిస్తారు. కర్తృపదాన్ని లోపింపచెయ్యటానికి ఇంగ్లీషులో సాధారణంగా వీలుండదు తెలుగులో సందర్భాన్ని బట్టి గ్రహించగలిగిన ఏ పదాన్నైనా లోపింపజెయ్యవచ్చు తెలుగులో "ఎవరక్కడ?' 'నేను" అనే సంభాషణ సాధ్యమయితే ఇంగ్లీషులో Who is there? It is me అనాలి తెలుగులో పదక్రమ వ్యత్యయానికి ఉద్దేశ్య విధేయ వ్యత్యయంవల్లవచ్చే అర్థ ప్రాధాన్యముంది కాని ఇంగ్లీషులో లాగా కర్తృకర్మపదాల సంబంధ వ్యత్యయం జరగదు ఇంగ్లీషు పదక్రమానికి ప్రత్యేక వ్యాకరణ ప్రయోజనం ఉంది తెలుగు పదక్రమానికి అట్లాంటి ప్రయోజనం లేదు. ఇంగ్లీషు భాష పదక్రమ వ్యత్యయాన్ని అంతగా సహించదు. తెలుగుభాష ప్రాధాన్య వివక్ష కోసం పదక్రమ వ్యత్యయాన్ని ఉపయోగించుకుంటుంది

**5.3.4.2:** తెలుగు భాషలో స్వామ్య అనుభోక్త్రాద్యర్థాల్లో నామానికి కు-విభక్తి చేరుతుంది ఉదా: *ఆమెకు పది చీరలున్నై. నాకు జలుబుచేసింది. నాకు సంతోషంగా ఉంది అతనికి లాటరీలో లక్షరూపాయలు వచ్చినై. వాడికి బజార్లో పార్కర్ కలం దొరికింది. నీకు తెలుసు* - ఇట్లాంటి వాక్యాల్లో కు - బంధానికి బదులు ఇంగ్లీషులో కర్తృపదాన్ని వాడతారు. తెలుగులో ఉన్నటువంటి

పద్ధతే తరతమ భేదాలతో ఇతర భారతీయ భాషల్లో కూడా కనిపిస్తుంది స్లావిక్ భాషల్లో కూడా కర్తృపద ప్రాధాన్యం తక్కువ. ఇట్లాంటి వాక్యాలను Dative subject sentences అని కొందరు వ్యవహరిస్తారు

**5.3.5:** తెలుగులో అనుకరణ విధానం అతి విస్తృతమయింది కేవలం భాషేకాక భాషేతరాంశాలు కూడా తెలుగులో అనుకృత మవుతున్నై ఇంద్రియ గ్రహణ యోగ్యమైన ప్రతిదీ తెలుగులో అనుకరణయోగ్యమే ప్రత్యక్ష పరోక్షానుకృతులు రెండింట్లోనూ అనుకరణ సూచకం (అని శబ్దం) ఉంటుంది. ఇది అనుధాతు నిష్పన్న క్రియా (అవ్యవహిత)యోగంలో వికల్పంగా లోపిస్తుంది పరోక్షానుకృతిలో ఉత్తమ పురుష ప్రధాన వాక్యంలోని కర్తను కాపీ (copy) చేసి మారినప్పుడు క్రియావిభక్తి ఉత్తమ పురుష నుంచి మారకుండా అట్లాగే ఉంటుంది ఇది క్రియావిభక్తి విధానం విస్తృతంగా ఉన్న భాషలన్నిట్లోనూ ఇట్లాగే ఉండొచ్చు తెలుక్కి ప్రత్యేకమైనా కావచ్చు తెలుగులో కర్త్రుద్ధరణ సూత్రం అనుకృత వాక్యం సమీకరణ వాక్యమైనప్పుడే ప్రవర్తిస్తున్నట్లు కనిపిస్తున్నది ఆర్యభాషల్లో ఇట్లాంటి పద్ధతిలేదు. దక్కనీ ఉర్దూలో మాత్రం తెలుగు ప్రభావం వల్ల కాబోలు కనిపిస్తున్నది.

**5.3 6:** ఏకకర్తృక వ్యాపార సమసామయికానుపూర్వీక సంబంధాలు తెలుగులోను ఇతర ద్రావిడ భాషల్లోను అసమాపక క్రియల ద్వారా వ్యక్తమవుతై. క్త్వార్థక వాక్యాలు హేత్వర్థక రీత్యర్థకాలు కూడా అవుతై వీటిలో కొన్ని ఆర్య భాషలకు కూడా పాకినై

**5 3.7:** తెలుగులో సంయుక్త వాక్యాలకూ అసంయుక్త వాక్యాలకూ భేదం స్వల్పం సంకలనార్థంలో క్త్వార్థక వాక్యాలే సంయుక్త వాక్యప్రయోజనంలో ప్రవర్తిస్తై పదబంధ సంయోజనంలో సంయోజన సూచకం సంయోజక పదబంధాలన్నిటికీ పదంలో ప్రత్యయం లాగా వస్తుంది. కొన్ని భాషల్లో పూర్వంలో వస్తుంది. ఇంగ్లీషులో and or, but అనే పదాలను వాటికి పరంలో ఉన్న పదాలకు సన్నిహితమైనవిగా భావిస్తారు

**5.4:** ఇవిగాక ఇంకా చాలా విశేషాలను ప్రస్తావించవచ్చు గాని, ఏది విశేషం అని నిర్ణయించుకోటవం కష్టం ఈ పైన పేర్కొన్నవి సర్వభాషా సామాన్యాలు కావు ఇవి తెలుగులోనూ ఇతర ద్రావిడ భాషల్లోనూ మాత్రమేకాక ఎక్కడో దూర తీరాల్లో ఉన్న భాషల్లో కూడా కనిపించవచ్చు భాషలు భిన్నత్వాన్ని నిలుపుకుంటూనే ఏకత్వాన్ని సూచిస్తై మానవత్వాన్ని పూర్తిగా ప్రతిబింబించేది భాష. మనుషుల్లోనూ, భాషల్లోనూ భేదాలున్నా మనుషులంతా ఒకటే, భాషలన్నీ ఒకటే

# 6. ఆధునికభాష : సంగ్రహవర్ణన

భాషలో అనుస్యూతంగా వచ్చే మార్పులను గ్రహించాలంటే సాధ్యమైనంతవరకు ఇతర భాషలనుంచి వచ్చి చేరిన శబ్దజాలాన్ని వేరుచేసి పరిశీలించడం అవసరం తెలుగులో ఇట్లా భిన్నకాలాలలో తెరలుతెరలుగా కొత్తపదాలు వచ్చి చేరాయి కొన్ని భాషల్లో అంతకుముందే ఉన్నమాటలతో వేరుచేసి చూపించలేనంతగా కలిసిపోయినా మరికొన్ని వేరుగానే ఉండిపోయినాయి సంస్కృతం నుంచి వచ్చి చేరిన మాటల్లోఅట్లా కలిసిపోయిన వాటిని తద్భవాలనీ కలవకుండా ఉన్నవాటిని తత్సమాలనీ అనటం సంప్రదాయం. కలిసిపోవటమంటే భాషలోలేనిధ్వనుల సంయోజనంతో ఉన్నమాటలు ఉన్నధ్వనుల సంయోజనంగా మారిపోవటం తెలుగువ్యవహర్తలలో చారిత్రకంగా అధిక విద్యావంతులైనవారు అన్యభాషాపదాలను సాధ్యమైనంతవరకు ఆ భాషోచ్చారణకు సన్నిహితమైన ఉచ్చారణను అనుసరించే అలవాటున్న వారు కావటంవల్ల ఇట్లా కలవని మాటలు తెలుగులో ఎక్కువగానే కనిపిస్తున్నాయి. అందువల్లనే తెలుగులో తత్సమశబ్ద బాహుళ్యం. నేటి తెలుగులో ధ్వనుల నిర్మాణాన్ని సమగ్రంగా పరిశీలించాలంటే దేశ్యశబ్దాల్నుంచి వేరుచేసి చూడాలి అప్పుడే ఏ ధ్వనులు తెలుగుకు సహజ పరిణామసిద్ధాలో ఏవి అన్యత్రావచ్చి చేరినవో తెలుసుకోవచ్చు

తెలుగులో తత్సమ, తద్భవవిభాగం వ్యవహర్తలందరికీ ఒకే రకంగా ఉండదు. తెలుగు, సంస్కృతాది సాహిత్యాలతో కొద్దో గొప్పో పరిచయం ఉన్న వారి భాషలో తత్సమాలయినవి ఇతరుల వ్యవహారంలో తద్భవాలు కావచ్చు ఇతర భాషాశబ్దాల భిన్నత్వాన్ని నిలబెట్టే అవసరంలేని వారి వ్యవహారంలో తత్సమాలు తద్భవాలయిపోతాయి

**1** ఇప్పటి తెలుగులో దేశ్యభాగాన్ని తద్భవభాగాన్ని మాత్రమే దృష్టిలో ఉంచుకొని పరిశీలిస్తే ఈకింది విధంగా వర్ణవిభాగం నిర్దేశించవచ్చు

**హల్లులు**

| ఓష్ఠ్య | దంత్య | మూర్ధన్య | తాలవ్య | హనుమూలీయ |
|---|---|---|---|---|
| స్పర్శ | శ్వాస | ప | త ట | క |
| స్పృష్టోష్మ | నాద | బ | ద డ | గ |
| ఊష్మ | శ్వాస | | | చ |
| | నాద | | వ | జ |

| | ఓష్ఠ్య | దంత మూలీయ | మూర్ధన్య | తాలవ్య |
| --- | --- | --- | --- | --- |
| అనునాసిక | మ | న | ణ | |
| పార్శ్వీక | | ల | ళ | |
| కంపిత | | ర | | |
| అంతస్థ | వ | | | య |

## అచ్చులు

| | పురస్ | కేంద్ర | పశ్చాత్ |
| --- | --- | --- | --- |
| అగ్ర | ఇ ఈ | | ఉ ఊ |
| మధ్య | ఎ ఏ | | ఒ ఓ |
| అధస్ | | అ ఆ | |

2 ఇతర భాషల నుంచి వచ్చిన వ్యంజనాలు :

| | | | | |
| --- | --- | --- | --- | --- |
| ఫ f | థ | ఠ | ఛ | ఖ |
| భ | ధ | ఢ | ఝ | ఘ |
| | | ష | శ | హ |
| | | | ఞ | ఙ |

వీటిలో ఒక్క 'f' ను మినహాయిస్తే తక్కిన వర్ణాలన్నీ సంస్కృత ప్రాకృత హిందీవంటి ఇండో-ఆర్యన్ భాషలనుంచి వచ్చిన మాటలద్వారా తెలుగులో చేరినాయి. అవి ఆ మాటలకే పరిమితమయి ఉన్నాయి కూడా హ వర్ణం కొన్ని కన్నడంనుంచి వచ్చిన మాటల్లోకూడా ఉన్నది. ఉదా. హత్తు, హెచ్చు హొన్ను మొ మహాప్రాణవర్ణాలు కొన్ని తెలుగుమాటల్లో అరుదుగా కనిపిస్తున్నాయి ఫది, ముప్ఫై, నలభై, ఏభై, డెభ్భై, ఎనభై, తొంభై వంటి మాటల్లో వినిపించే మహా ప్రాణోచ్చారణకు మూలంచెప్పటం కష్టం. ఇతరభాషా ప్రభావం కారణమనటానికి ఆధారాల్లేవు.

ఖారం ఘాలి ధారం భావి అనే తెలుగు మాటల్లో మహాప్రాణోచ్చారణకు కృతక ప్రామాణికత్వం కారణంగా కనిపిస్తుంది

నేటి తెలుగువారి ఉచ్చారణలో చదువుకున్న వారిలోనైనా మహాప్రాణోచ్చారణ తక్కువే. ఓష్ఠ్య వర్ణాల్లో కవినిపించినంతగా నిరోష్ఠ్యవర్ణాల్లో వినిపించదు ఠ, ఢ, ఛ, ఝ లు కంఠం, ఛంరవంటి కొన్ని మాటలను మినహాయిస్తే ఎక్కువగా కావ్యభాషకే పరిమితమైనట్టు కనిపిస్తుంది ఉదా . ఠావు, ఠేవ, పరిఢవిల్లు, ఛత్రము, ఛాత్రుడు, ఝషము, ఝంకారము మొ

తెలుగులో మహాప్రాణోచ్చారణకు అర్థభేదకసామర్థ్యంలేదు మహాప్రాణోచ్చారణనిర్దిష్టమైన శబ్దాలను అల్పప్రాణంతో ఉచ్చరించినా అర్థావగాహనకు ఆటంకంలేదు వ్యవహర్తల ప్రాచ్య ప్రాచీనవిద్యాగంధాన్నిగాని సాంస్కృతికంగా వారి ఔన్నత్యాన్నిగాని సూచించటానికి మహాప్రాణోచ్చారణ ప్రవర్తిస్తుంది ఏదైనా విషయాన్ని నొక్కి చెప్పాలినప్పుడు కూడా మహాప్రాణోచ్చారణ ఉపయుక్తమవుతున్నది ఉదా వెంఠనే, ఒఖ్టే, సరిగ్ఘా, ఏమీఖ్ఖలేదు స్పర్శేతరాల్లో కూడా కనిపించటం వల్ల దీన్ని హ వర్ణోచ్చారణగా గ్రహించవచ్చు

3. తెలుగు లిపిలో కనిపించే శ, ష, స వర్ణాల్లో చివరిదే ప్రాచీన భాషనుంచి వచ్చింది శ, ష, లు సంస్కృతం హిందీ మాటలనుంచి ప్రవేశించాయి 'శ' వర్ణానికీ నిర్దిష్టమైన ఉచ్చారణ తెలుగులో వినిపించటం అరుదు నిరోష్ఠ్యాచ్చుల ముందు (ఇ ఈ, ఎ ఏ అ ఆ) శ, సలకు భేదం వినిపించదు కొందరిఉచ్చారణలో మాత్రం ఓష్ఠ్యాచ్చుల ముందు వినిపిస్తుంది ఉదా . శుభ్రం త్రిశూలం శోభనం

f ముఖ్యంగా ఉర్దూ నుంచి ఇంగ్లీషునుంచి వచ్చిన మాటల్లో ఉంది ఉదా ఫసలీ ఫైసలు, కాఫీ ఈ వర్ణోచ్చారణ కొందరి వ్యవహారంలో సంస్కృత ఫ వర్ణోచ్చారణకు బదులుగానూ, సంఖ్యావాచకాల్లోనూ ఉంది. ఉదా : కఫం ఫలితం ఫణి, నలఫై, యాఫై ఎనఫై.

ఇతర భాషలనుంచి తెలుగులో వచ్చి స్థిరపడిన అచ్చులు లేవు ఆధునిక భాషలో వివృతమైన ఎ, ఏ లు, ఒ, ఓలుఇంగ్లీషు మాటల్లోవినిపించినా అవి స్థిరపడ్డట్టు కనిపించదు. ఒక్క ఏ మాత్రం గుర్తించదగినంతగా చాలామంది వ్యవహారంలో వినిపిస్తుంది ఉదా · bank cash glass మొ · తెలుగులో భూతకాలసమాపక క్రియల ఉచ్చారణలో కొన్నిమండలాల్లో ఉంది ఉదా : వచ్చాడు, ఆగాడు మొ

**4. తెలుగు వర్ణాల ఉచ్చారణ : హల్లులు :** స్పర్శాలు . స్పర్శాలన్నిటికి పదాదిన, సంయోగంలో అధిక స్పృష్టోచ్చారణ (fortis articulation) అచ్చులమధ్య అల్పస్పృష్టోచ్చారణ (lenis articulat on) ఉంది నోటిలో కండరాలను కుంచించి ఎక్కువ వత్తిడితో ఉచ్చరించే వాటిని అధిక స్పర్శాలంటారు కండరాలను వదులుగా ఉంచి ఉచ్చరించిన వాటినిఅల్పస్పర్శాలంటారు ఈ అల్పస్పృష్టోచ్చారణ నాదవర్ణాల్లో ఎక్కువగా గుర్తించవచ్చు ఉదా : గడ, పగలు, దారి పొద

అచ్చులమధ్య డ వర్ణం హిందీ భాషలో వినిపించే శిధిల స్పర్శంతోతుల్యోచ్చారణ కలిగి ఉంటుంది ఉదా . గడ పడవ.

స్పృష్టోష్మాల్లో జ వర్ణానికి అచ్చులమధ్య ఊష్మోచ్చారణ ఉంది. ఉదా గాజు (gazu), బూజు (buzu) స్పృష్టోష్మాలకు తాలవ్యాచ్చులముందు తాలవ్యోచ్చారణ -తాలవ్యేతరాచ్చుల ముందు దంతమూలీయోచ్చారణ ఉంది ఉదా: చిన్న చీమ చెల్లెలు, చేదు చేట· చూపు చొక్కా చోటు చల్ల, చాప ఈ ఉచ్చారణ భేదం అన్ని మండలాల్లోనూ లేదు తాలవ్యోచ్చారణ మాత్రమే ఉంది.

అనునాసికాలు: మ వర్ణానికి అచ్చుల మధ్య పదాంతంలోను అనునాసిక వ కారోచ్చారణ ఉంది సంస్కృతాది భాషల నుంచి వచ్చిన శబ్దాల్లో మాత్రం ఈ ఉచ్చారణ విద్యావంతుల భాషలో లేదు సంస్కృత శబ్దాలయినా సంవత్సరం వంశం మాంసం సింహంవంటి మాటల్లో పదాంతంలోను సంయోగంలోను వ శ స,హ ల ముందు ఈ ఉచ్చారణుంది ఈ అనునాసిక వకారోచ్చారణ కోస్తా జిల్లాల్లో ఎక్కువగా ఉంది తెలంగాణ రాయలసీమ వ్యవహర్తలందరిలో ఈ ఉచ్చారణ లేదు పరోక్ష విధిలో ఆగమంగా వచ్చే మ వర్ణానికి మాత్రం అచ్చుల మధ్య అయినా స్పృష్టోచ్చారణే ఉంది ఉదా. చెప్పమన్నాడు

న వర్ణానికి పదాదిన ద్విరుక్తిలో అచ్చుల మధ్య దంతమూలీయోచ్చారణ ఉంది; దంత్యవర్ణాల ముందు దంత్యోచ్చారణ ఉంది ఉదా నాన్న కొంత

తెలుగులో ఙ ఞ అనే గుర్తులతో సూచించే ఉచ్చారణ క్రమంగా క వర్గ, చ వర్గ వర్ణాల ముందే ఉంది కాబట్టి వీటిని ప్రత్యేక వర్ణాలుగా గుర్తించక్కర్లేదు భాషా పరిశోధకులు వీటిని న వర్ణోచ్చారణ భేదాలుగానే గుర్తిస్తున్నారు మవర్ణ భేదాలుగా గుర్తించినా ఇబ్బందిలేదు తెలుగు లిపిలో సున్నతో రాస్తాం కాబట్టి ఈ సమస్యరాదు సున్న అధివర్ణం (arch phoneme)

'ణ' వర్ణం అచ్చుల మధ్య ట వర్గస్పర్శాల ముందు వస్తుంది దీనికి ద్విరుక్తి సంధిలో మాత్రమే ఉంది గుర్తించదగిన ఉచ్చారణ భేదాలు లేవు అచ్చుల మధ్య మాత్రం శిథిలోచ్చారణ ఉంది

ద్విరుక్త 'ణ' కార ఘటితమైన దణ్ణెం అనే రూపం కొన్ని చోట్ల వినిపించినా దానికి పూర్వరూపమైన దండెం కూడా వ్యవహారంలో వినిపిస్తుంది. గొణ్ణెం అనే శబ్దానికి గొళ్లెం, గొండెం అనే రూపాంతరాలున్నాయి. దీనికి గొండ్లెము అనేది పూర్వ రూపం ణ కారద్విత్వం సమీకరణం వల్ల వచ్చింది

మ వ వర్ణాలకున్న పరిసర బాహుళ్యంగాని బహుశబ్ద ఘటితతత్వంగాని ణ' వర్ణానికి లేవు గ్రామీణుల వ్యవహారంలోగాని, శ్రామికుల వ్యవహారంలోగాని ట వర్గ వర్ణాల ముందు తప్ప దీని ప్రయోగం కనిపించదు దీన్ని సున్నతో రాస్తున్నాం

పార్శ్వికాలు: పార్శ్విక వర్ణాల్లో దంతమూలీయ మూర్ధన్యభేదం ఉంది ల దంతమూలీయం, ళ మూర్ధన్యం వీటికి గుర్తించదగిన ఉచ్చారణ భేదాలు లేవు

ళ వర్ణం పదాదిన రాదు అద్విరుక్తిలో ళ వర్ణ ఘటిత శబ్దాలు దొరకటం కష్టం ద్విరుక్తిలో సమీకరణం వల్ల ఏర్పడ్డ ఒళ్లు కళ్లెం గొళ్లెం (వీటిలో కొన్ని అన్యభాషా పదాలు కావచ్చు) వంటి నామాల్లోను కుళ్లు, తుళ్లు, మళ్లు, వెళ్లు వంటి కొన్ని క్రియల్లోను మళ్లీ వంటి అవ్యయంలోను కనిపిస్తున్నది ఇవి పది పన్నెండు శబ్దాలకన్నా మించిలేవు వ్యాకరణ కార్యాలవల్ల కళ్లు పళ్లు, ముళ్లు

కాళ్లు కోళ్లు తాళ్లు తేళ్లు వంటి మాటల్లోనూ అవ్యవహితోచ్చారణలో డ-ల వర్ణ సంయోజనం వల్ల ఈ ళ వర్ణోచ్చారణ వినిపిస్తుంది చాలా మంది శ్రామికుల ఉచ్చారణలో ఈ ళ వర్ణోచ్చారణ వినిపించదు

రేఫం. రేఫవర్ణం దంతమూలీయ కంపితం సంయోగంలో ట వర్గ వర్ణాల తరవాత వచ్చినప్పుడు మూర్ధన్యోచ్చారణ ఉంది ఉదా కుట్ర కొండ్ర తండ్రి మిగతాచోట్ల దంతమూలీయోచ్చారణ ఉంది ద్విరుక్తిలో ఇది అధిక కంపితమౌతుంది ఉదా కఱ్ఱ కఱ్ఱు తవర్గ వర్ణాల తరవాత దంత్యోచ్చారణ ఉంది ఉదా పాత్ర పాత్రం ఆత్రం

**అంతస్థాలు** కొంత స్వరధర్మం కొంత వ్యంజన ధర్మం ఉన్న వర్ణాలు అంతస్థాలు య వర్ణం ఉచ్చారణలో ఇ వర్ణతుల్యం వ ఉ వర్ణతుల్యం ఉచ్చారణలో స్వరతుల్యత్వం ఉన్నా అక్షర (Sy lab e) నిర్మాణంలో వ్యంజనాల్లాగే ప్రవరిస్తాయి

య వలు ద్విరుక్తిలో ఎక్కువ ఒరపిడితో ఉచ్చరితమవుతాయి ఉదా అయ్య అవ్వ

పదాదిన తాలవ్యాచ్చుల ముందు య కారోచ్చారణ ఓష్ఠ్యాచ్చుల ముందు వ కారోచ్చారణ అదనంగా వినిపించినా అక్కడ వీటికి వర్ణత్వం లేదు. అదైనా నియతం కాదు ఇవి లేని ఉచ్చారణ కూడా తరచుగా వినిపిస్తుంది ఉదా ఇది - యిది ఎవరు - ఎవరు ఊరు-వూరు ఒకడు - వొకడు

**అచ్చులు** నాలుక మూర్ధం వైపుగా లేచే ఎత్తును బట్టి ఉచ్చారణలో నాలుక ముందు, మధ్య వెనక భాగాల ప్రాధాన్యాన్ని బట్టి పెదవుల ఆకారాన్ని బట్టి అచ్చుల విభాగం ఉంటుంది తెలుగులో ఇ, ఈ ఏ, ఏ లు నిరోష్ఠ్యతాల వ్యాచ్చులు ఉ ఊ, ఒ, ఓ లు ఓష్ఠ్యపశ్చాదచ్చులు అ ఆ లు కేంద్ర నిస్తాలవ్య నిరోష్ఠ్యాచ్చులు ఇ, ఈ, ఉ, ఊ లు అగ్రాచ్చులు ఎ, ఏ ఓ లు మధ్యాచ్చులు; అ ఆ లు నిమ్నాచ్చులు తెలుగు అచ్చులకు పరంలో అ ఆ లు వచ్చినప్పుడు వివృతోచ్చారణ ఉంది ఉదా. పిల్లి-పిల్ల పీకు-పీక మెట్టు-మెట్ట మేకు-మేక, గుడ్డు-గుడ్డ గూడు-గూడ, గోడు-గోడ కంపు-కంప కాడు-కాడ. ఈ ఉచ్చారణ భేదం కోస్తా జిల్లాల్లో అధికంగా ఉంది. ఈ స్వరవివృతి కొందరి ఉచ్చారణలో సంస్కృత శబ్దాల్లో కూడా వినిపిస్తుంది ఉదా. క్షేత్రయ్య సేకరణ ఇది ఇతర మండలాల్లో అరుదు

ఈ ఉచ్చారణ భేదం ఉన్నచోట వివృతిని కలిగించిన అ కారం సంధిలో గాని వ్యాకరణ కార్యంలోగాని లోపించినా ఈ వివృతోచ్చారణ నిల్చి ఉంటుంది

ఉదా మేకు+ఆ మేక+ఆ ?

ఈ వివృతిని అక్షరం కింద గీత ద్వారా సూచిస్తే క్రియల్లో ఈ విధంగా నిష్పత్తి చూపించొచ్చు.
లే + అక + లేక పో + అక పోక

ఇదికాక వివృతమైన ఏ ఉచ్చారణ క్రియల్లో ఇ + ఆ అచ్చుల సంయోగం వల్ల కూడా ఎర్పడుతుంది ఉదా అగి + అడు= ఆగేడు చెప్పి+అడు= చేప్పేడు వెళ్ళి+ఆడు= వెళ్లేడు

పదాంతంలోనూ మకారాంత పదాల్లో చివరి మ కారానికి పూర్వం వచ్చినప్పుడు ఎ వర్ణానికి వివృతోచ్చారణ ఉంది ఉదా గిన్నె పళ్లెం

ఈ విధంగా వివృతోచ్చారణను సూత్రబద్ధం చేసి చెప్పవచ్చు గాబట్టి వివృతాచ్చులను ప్రత్యేక వర్ణాలుగా కాక ఉచ్చారణ భేదాలుగా గుర్తిస్తేచాలు

తెలుగు సంధిలో అచ్చులు లోపించినప్పుడు ఇంకా చాలా ఉచ్చారణ భేదాలు వినిపిస్తాయి అవి సంధిలో ప్రస్తావించబడతాయి

5 **వర్ణసంయోజన నియమావళి** ఎ భాషలోనయినా అన్ని వర్ణాలు అన్ని పరిసరాల్లోనూ రావు కొన్ని రకాల వర్ణ సంయోజనాలు మాత్రమే సాధ్యమవుతాయి కేవలం ఏక శబ్ద పరిమితిగల తెలుగు మాటలనే తీసుకొంటే ఈ కింది నియమాలను గనమించవచ్చు

1. య, ఞ ళ అనే వ్యంజనాలు పదాదినరావు - యాభై యాస లలో ఆదివర్ణం య కారంగా గుర్తిస్తే ఈ శబ్దాలు ఇందుకపవాదాలవుతాయి

2 ట వర్ణం పదాదిన అరుదు డ వర్ణం మాత్రం కొన్ని మాటల్లో కనబడుతున్నది తెలంగాణంలో తొంభైకి టొంబై అనేరూపం ఉంది ఉదా· *టక్కరి, టెంకె, టెంకాయ, డేకు, డోకు, డబ్బు డెక్క, డెబ్బై, డేగ.*

3 పదాది 'వ' వర్ణం తరువాత ఓష్ఠ్యేతరాచ్చులే రాగలవు ఉదా: వల, వాడు, విల్లు, వీలు, వెన్న, వేట

4. పదాదిన ద్విరుక్త, సంయుక్త వ్యంజనాలుండవు ప్రాచీన భాషలో వర్ణ వ్యత్యయం వల్ల ఏర్పడ్డ క్రంత, గ్రద్ద త్రిప్పు ప్రాత, బ్రతుకు వంటి మాటల్లో రెండో వ్యంజనమైన రేఫం ఆధునిక భాషలో జారిపోయింది కొంత మంది వ్యవహారంలో అరుదుగా ఉంది వ్రాత, వ్రాలు అనే మాటలు క్రమంగా *రాత*, వాలు అని మారాయి

5. ధాతువుల్లో మొదటి అక్షరంలో మాత్రమే దీర్ఘాచ్చు ఉంటుంది

6 నామాల్లో జంతు, పక్షి వృక్ష నగర వాచక శబ్దాల్లో మాత్రమే ఏ ఓ లు మధ్యాచ్చుగా కనిపిస్తున్నాయి అబ్బాయి, అమ్మాయి అనే మాటల్లోనూ తల్లాడవంటి గ్రామనామాల్లోనూ ఆ మధ్య స్వరంగా కనిపిస్తున్నది తాబేలు కుందేలు పొటేలు పూరేడు, గన్నేరు, పల్లేరు తంగేడు నేరేడు, మారేడు చెంబేడు ఒంగోలు - వీటిలో ఓలు ప్రోలుకు రూపాంతరంగా భావించవచ్చు.

కాని ఎలును జంతువాచక శబ్దంగా ఇప్పటి భాషలో నిరూపించటం కష్టం. అట్లాగే ఏడు ఏరు వృక్షవాచకశబ్దాలుగా నిరూపించటం ప్రయాసతో కూడుకొన్న పని ఒకప్పుడు ఇవన్నీ భిన్న శబ్దాలు కావచ్చు నేటి వ్యవహర్తలకు ఇట్లాంటి పరిజ్ఞానం ఉందని తేల్చటం కష్టం

7 ఒ వర్ణం మొదటి అక్షరంలో మాత్రమే ఉంటుంది అంతంలో దీర్ఘాచ్చురాదు ఇట్లా, అట్లా అనే శబ్దాలు ఆధునిక భాషలో ఇందు కపవాదాలు

8 దీర్ఘాచ్చు తరవాత ద్విరుక్త వ్యంజనం ఉండదు కొన్ని బంధువాచక శబ్దాల్లో మాత్రమే ఉంది ఉదా అమ్మ నాన్న బామ్మ మామ్మ

9. స్పర్శాలముందు స్పృష్టోష్మాల ముందు అనునాసిక వర్ణం ఆ వర్గజమై ఉంటుంది కాని ఒకటి రెండు మాటలు మాత్రం ఇందుకపవాదాలుగా నిల్చినాయి ఉదా కాన్పు పాన్పు వీటికి కానుపు పానుపు అని రూపాంతరాలున్నాయి

10 ఈ కింది వ్యంజన సంయోగాలు నేటి తెలుగులో కనిపిస్తున్నాయి

త్ర= పాత్రం దీని రూపాంతరం పాత్తరం ంద్ర= తంద్రి వీటిని ౖంౖ అనే సంయోగంగా గ్రహిస్తే మూడు వ్యంజనాల సంయోజనం తెలుగులో లేదనవచ్చు మధ్యవచ్చే డ ధ్వని సూత్రం ద్వారా సాధ్యం అంటే డ వర్ణానికిక్కడ స్వతంత్ర ప్రతిపత్తి లేదనీ ణ-ర ల సంయోగ ఫలితమేననీ దీని భావం తెలంగాణంలో చెల్క, అర్క, ఎన్క, గట్క వంటి మాటల్లో చాలా వ్యంజన సంయోజనాలు సాధ్యమైనా వాటిని మధ్య-స్వరలోప సూత్రం ద్వారా సాధించవచ్చు

11 శబ్దాంతంలో మ య వర్ణేతర వ్యంజనాలు రావు య వర్ణమైనా చాలా కొద్ది మాటల్లోనే ఉంది ఉదా సంఖ్యా వాచకాలు ఇరవై ముప్పై నలభై యాభై ఇరవై డెబ్భై తొంభై ఇక్కడ ఐ= అయ్

12 మవర్ణోపధ శబ్దాల్లో పూర్వాచ్చులు ఇ, ఉ ఉంటే పరాచ్చులు కూడా అవే ఉంటాయి. 'అ' ఉంటే ఉ-అలు ఎ ఉంటే ఉ మాత్రమే ఉంటాయి ఉదా. కలిమి నడిమి కుడుము మడమ ఎడము పెదెము పళ్లెము కొక్కెము పదాంతంలో ఉన్న ఉ వర్ణాన్ని గుర్తించకపోతే ఈ నియమాన్ని ఇంతకన్న భిన్నంగా చెప్పాల్సి ఉంటుంది

13 మూడచ్చుల మాటల్లో చివరి అచ్చు నిరోష్ఠ్యమైతే మధ్యాచ్చు నిరోష్ఠ్యం, చివరి అచ్చు తాలవ్యేతరమైతే మధ్యాచ్చు తాలవ్యేతరమూ అవుతుంది అ వర్ణం తాలవ్యేతరమూ నిరోష్ఠ్యమూ ఈ నియమంపై నియమం (12) వర్తించగా మిగిలిన శబ్దాలకే వర్తిస్తుంది మిగతా శబ్దాల్లో నడిమి అచ్చు ఆ, ఇ ఉ లలో ఒకటి అయి ఉంటుంది అంటే ఎ, ఒ లు ఉండవు చివరి అచ్చు ఆ, ఇ ఉ లలో ఒకటి మాత్రమే కాక ఎ వర్ణం కూడా ఉంటుంది ఒ వర్ణం మాత్రం ఉండదు.

| అచ్చు$_1$ | అచ్చు$_2$ | అచ్చు$_3$ |
|---|---|---|
| | ఇ, అ | ఇ ఎ అ |
| | ఉ, అ | ఉ, అ |

ఉదా.- పొడుగు కుడితి ములికి, గాడిద ఎలికె

14. ధాతువుల్లో దీర్ఘాచ్చు మొదటి అక్షరంలోనే ఉంటుంది చివరి అచ్చు ఉ వర్ణేతరముండదు మధ్యాచ్చులు ఇ అ, ఉ లు మాత్రమే ఉంటాయి యోపధ (య ఉపధ) ధాతువులు మాత్రమే ఇన్మధ్యం కాగలవు ఉదా. తెలియు (తెలియదు) కదలు (కదలిక) అడుగు అన్మధ్య ధాతువులనైనా కదలిక (<కదలు) బడలిక (<బడలు) వంటి నామ నిష్పాదన ప్రక్రియ కోసం గుర్తించాల్సి వచ్చింది ఆధునిక భాషలో 'తెలియు తప్ప ఇన్మధ్య ధాతువులుగా గుర్తించాల్సినవి లేవు

15 ఏక శబ్దంలో వ, ణ వర్ణాలకు ద్విత్వం లేదు. కస్సు బుస్సు అనే ధ్వన్యనుకరణాలకు శబ్దపరిగ్రహణం జరగలేదు. తెలంగాణలో కొన్నిచోట్ల 'లెస్స అనే మాట వాడుకలో ఉంది ణ వర్ణానికి ద్విత్వం అరుదుగా గొణ్ణెం దణ్ణం, దణ్ణెం వంటి కొన్ని మాటల్లో మాత్రమే కనిపిస్తున్నది కళ్లం కళ్లె, కళ్లెం గొళ్లెం, పళ్లెం వంటి నామాలు, కుళ్లు తుళ్లు మళ్లు వెళ్లు వంటి క్రియలూ లేకపోతే ళ వర్ణం ద్విత్వం కూడా లేనట్టే ఇవి ఆధునిక కాలంలో ఏర్పడ్డ రూపాలు కావచ్చు.

16. ద్విరుక్తవర్ణాలు మొదటి హ్రస్వాచ్చు తరవాతనే ఉంటాయి

ఈ పై నియమావళి ఏక శబ్ద పరిమితికి మాత్రమే వర్తిస్తాయి ప్రకృతి ప్రత్యయ సమ్మేళనంలో గాని భిన్న శబ్దయోగంలోగాని చాలా రకాల వర్ణసంయోజనాలు సాధ్యం కావచ్చు ఉదా వస్తాడు, చెప్తాడు వెళ్తుంది కొడ్తుంది చేద్దాం తిట్టుద్ది

**6. సంధి** త్వరితోచ్చారణలో అవ్యవహితంగా వచ్చిన శబ్దాల్లో జరిగే ధ్వనుల మార్పిడి సంధి. వ్యవహితోచ్చారణలో పదాల మధ్య సంధి ప్రవర్తించదు స్వరలోపమూ దాని ఫలితంగా దగ్గరగా వచ్చిన వ్యంజనాల్లో సమీకరణాది మార్పులు తెలుగు సంధిలో జరుగుతాయి

1 దగ్గరగా వచ్చిన రెండచ్చుల్లో పూర్వహ్రస్వాచ్చు లోపిస్తుంది. ఉదా ఆయన + ఎవరు> ఆయనెవరు, వారు + ఉన్నారు>వారున్నారు

2. లోపించిన హ్రస్వాచ్చు తాలవ్యమైతే పరంలో ఉన్న నిస్తాలవ్యాచ్చుకు తాలవ్యత వస్తుంది ఉదా. బండి + అంతా కోడి + అదిగో చెప్పి + ఉంటాడు అది + ఒకటే

3. స్వరాది ప్రత్యయం పరమైనప్పుడు సంధికి వికల్పత లేదు ఉదా. మూర + ఎడు మూరెడు, వచ్చింది+ఆ> వచ్చిందా?, పాట+ఏ>పాటే.

4 దీర్ఘస్వరాంతరూపాలకు తాలవ్యాచ్చులు పరమైతే య ఆగమంగా ఓష్ఠ్యాచ్చులు పరమైతే వ ఆగమంగా వస్తాయి ఉదా మా+ఇల్లు= మాయిల్లు మా+ఊరు= మావూరు అకారం పరమైనపుడు కూడా య ఆగమం కొందరి భాషలో కనిపిస్తుంది ఉదా మా+అమ్మ= మాయమ్మ మా+అన్న= మాయన్న అకార పరమైనపుడు వచ్చే య కారాగమం అన్న అమ్మ వంటి శబ్దాలకు పరిమితమైనట్లు తోస్తున్నది

5 ఎ రెండు సమవ్యంజనాల మధ్య

బి పూర్వవ్యంజనంలలో 'ల, న లలో ఒకటయి పరవ్యంజనం దంత దంతమూలీయ, తాలవ్య మూర్ధన్య వర్ణాల్లో ఒకటయినప్పుడు

సి పూర్వవ్యంజనం మూర్ధన్యమయి పరవ్యంజనం దంతమూలీయమయినప్పుడు

డి పూర్వవ్యంజనం దంత్యమై పరవ్యంజనం స్పృష్టోష్మమైనప్పుడు (చ జ)

మధ్యస్వరం లోపిస్తుంది

ఉదా చేప+పిల్ల> చేప్పిల్ల పిరికి+గుండె> పిరిగ్గుండె

కాలి+తో> కాల్తో, నూనె+తో> నూన్తో, తల+నూనె> తల్నూనె మన+లో> మన్లో పాల+డబ్బు> పాల్డబ్బు మన+చోటు> మన్చోటు పాల+చెంబు> పాల్చెంబు

మూట+లో> మూట్లో వాడి+ని> వాణ్ణి

పాత+చింతకాయ> పాచ్చింతకాయ

6 ఎ స్వరలోపానంతరం - పదంలో చ, జ లున్నప్పుడు పూర్వంలో త, ద లు కూడా చ, జ లుగా మారతాయి

బి పరవ్యంజనాన్ననుసరించి శ్వాసనాద సమీకరణం జరుగుతుంది

సి న ల లు మూర్ధన్య వర్ణసంయోగంలో (పూర్వంకాని పరంకాని) మూర్ధన్య వర్ణాలుగా మారుతాయి

ఉదా. పాత+జల్లెడ> పాజ్జల్లెడ ఇరుకు+గది> ఇరుగ్గది పాదు+తవ్వి> పాత్తవ్వి నీడ+లో> నీళ్ళో పాల+డబ్బా> పాళ్డబ్బా

సంధి జరగటానికి వీలున్న రెండు పరిసరాలు వెంట వెంటనే ఉండి సంధి జరిగితే కొన్ని చోట్ల మూడుహల్లుల సంయోగం ఏర్పడుతుంది అట్లాంటి చోట్ల పరసంధి ముందుగా జరిగి పూర్వసంధిని నిరవకాశం చేస్తుంది ఉదా మాటలు+రావు> మాటల్రావు గుడ్డలు-లు-లేవు> గుడ్డల్లేవు

కొన్నిచోట్ల పూర్వపరసంధుల్లో ఏదైనా జరగొచ్చు దారి+లు+లేవు> దార్లులేవు దారుల్లేవు కారు+లు+లో> కారు+ల+లో> కార్లలో కారుల్లో

సంధికి ప్రమేయం ఉన్న వ్యంజనాలు ఏకస్థానికాలయినప్పుడు ఇట్లా పూర్వపర సంధుల మధ్య వికల్పత్వం కనిపిస్తుంది

కాని గూడు-లు-లేవు> గూళ్లులేవు కోటు-లు-లేవు> కోట్లులేవు

ఇక్కడ పూర్వపరిసరంలోనే అచ్చుపోయింది మొదటి సంధి వర్ణ పరిసరం కాదు పద నిర్మాణ పరిసరం

7. ద్విరుక్త వ్యంజనం ఇంకో వ్యంజనం ముందు అద్విరుక్తమవుతుంది బహువచనాది ప్రక్రియలో స్వరలోపం వల్ల ఈ రకం పరిసరం ఏర్పడుతుంది

చెట్టు+లు> చెట్ట్+లు> చెట్లు

గుడ్డు+లు> గుడ్డ్+లు> గుడ్లు

తొట్టి+లో> తొట్ట్+లో> తొట్లో

7 **నామపదనిష్పత్తి బహువచనం:** ఏకవచన నామానికి లు అనే ప్రత్యయం చేరిస్తే బహువచననామం అవుతుంది ప్రకృతి ప్రత్యయ విభాగం లేకుండానే కొన్ని నామాలు బహువచన బోధకాలు. ఉదా పాలు నీళ్లు పెసలు ఉసిళ్లు పేలాలు బియ్యం వీటికి వ్యస్తంగా ఏకవచన ప్రయోగం లేదు ఇట్లాంటి వాటిని నిత్య బహువచనాలంటారు బహువచన ప్రత్యయయోగంలో ఏకవచన నామంలో కొన్ని మార్పులు జరుగుతాయి

1 దీర్ఘస్వరాంత శబ్దాల్లో మార్పులుండవు ఉదా. లంగాలు, లుంగీలు ప్రాయికంగా ఇవి అన్యదేశ్యాలు

2 అగ్రేతర (ఇ ఉ లు కాని) స్వరాంతశబ్దాల్లో అంత్యస్వర లోపం త్వరితోచ్చారణలోనే ఏర్పడుతుంది ఉదా. గోడలు, కోడెలు

3 కొన్ని శబ్దాల్లో తుది అక్షరం (Syllable) లోపిస్తుంది ఉదా పేను+లు > పేలు చేను+లు> చేలు, పూవు+లు> పూలు వేయి+లు> వేలు

కొందరి వాడుకలో పేండ్లు, చేండ్లు అని ఉన్నాయి కొందరి వ్యవహారంలో 'పువ్వులు అనే రూపం ఉంది.

4 ఇదంత శబ్దాల్లో ఆకారేతర దీర్ఘస్వర పూర్వకమైన 'య కారానికి త కారం ఆదేశం అవుతుంది. ఉదా చేయి+లు> చేతి> లు గోయి+లు> గోతి+లు నూయి+లు >నూతి+లు.

పొయ్యి వాయి, రాయి అనే శబ్దాలకు క్రమంగా పొయ్యిలు వాయిలు రాళ్ళు అనే రూపాలు బహువచనాలు

